# వేమన మంత్రాలు

## వసుంధర



చిత్రకారుడు
**కరుణాకర్**



ప్రచురణ
**కావ్య పబ్లిషింగ్ హౌస్**
12-13-830/13/బి, ఫ్లాట్ నెం.103,
ఎస్.ఎస్.ఆర్. అపార్ట్‌మెంట్స్,
గోకుల్‌నగర్, తార్నాక,
సికింద్రాబాద్ - 500 017.
ఫోన్ : 9866559867
email : kavyaph11@gmail.com

మొదటి ముద్రణ : డిసెంబరు, 2011

ముద్రణ
చరిత ఇంప్రెషన్స్
హైదరాబాద్ - 500 020.

*వెల రూ. 50/-*






# అద్దంలో కొండ



అనగనగా సిద్ధపురమనే ఊళ్లో వాణిదాసు అనే మహాపండితుడు. ఆయనకి నయుడు, వినయుడు అని ఇద్దరు కొడుకులు. వాళ్లు అమిత గారాబంగా పెరిగారు. తండ్రి పోరగా పోరగా వ్రాయడం చదవడం నేర్చుకున్నారు. కానీ ఎక్కువ సమయం ఆటపాటలతోనే గడిపేవారు. పెద్దలిచ్చిన ఆస్తి ఉంది కాబట్టి తిండికి లోటులేదు. వాణిదాసు కొడుకులని అంతా వాళ్లని ఆయనతో సమంగా గౌరవించేవారు. దాంతో నయ వినయులకి చదువు అవసరం తెలియలేదు.

నయ వినయులకి పదిహేనేళ్లప్పుడు తల్లి చనిపోయింది. వాణిదాసు వాణి అనే యువతిని మళ్లీ పెళ్లి చేసుకున్నాడు. సవతితల్లి వాణికి నయ వినయులంటే కిట్టేది కాదు. వాళ్లకి సరిగ్గా తిండి పెట్టేది కాదు. చీటికీమాటికీ తిట్టేది. ఏదో వంకన కొట్టేది కూడా. ఎప్పుడైనా వాణిదాసు మందలిస్తే, "పిల్లలిలా ఉంటే తల్లిని నాకు చెడ్డ పేరు. వాళ్లని బాగుచెయ్యనిచ్చారా సరేసరి. లేదా నేను పుట్టింటికి వెళ్లిపోతాను" అనేది. వాణిదాసు భార్యనేమీ అనలేక పిల్లల్ని దగ్గిరగా పిలిచి, "మనమీ ఇంట్లో శాంతిగా ఉండాలంటే మీరామెను మంచి చేసుకోండి" అని హితవు చెప్పాడు.

తండ్రి పేరుకు తగ్గట్లే వాణిదాసు అయ్యాడనుకున్నారు పిల్లలు. ఆమెతో సద్దుకుపోవడానికి నాలుగేళ్లు ప్రయత్నించారు. ఈలోగా వాణికి ఓ కొడుకు, కూతురు పుట్టారు. ఇక వాళ్ల సమయమంతా ఆ పిల్లల సేవలకే సరిపోతోంది. తండ్రికి చెప్పుకుంటే ఎప్పటిలాగే సద్దుకు పొమ్మన్నాడాయన. అప్పుడు వాళ్లు బాధగా, "ఊరంతా గౌరవించే మహాపండితుడివి. ఓ మామూలు ఆడదాన్ని అదుపు చెయ్యలేవా?" అన్నారు. ఆయన నవ్వి, "దీనికి మహాకవి వేమన ఏమన్నాడో తెలుసా? కొండ ఎంత పెద్దదైనా చిన్న అద్దంలో మొత్తం అంతా సద్దుకుపోతుందని. వాణి అద్దం. నేను కొండ. నేనా వేమన మంత్రాన్నే అనుసరిస్తున్నా" అంటూ ఈ కింది పద్యం చదివాడు.

*అనువుగాని చోట నధికులమనరాదు*
*కొంచెముండుటెల్ల గొదువ గాదు*
*కొండ యద్దమందు గొంచమైయుండదా*
*విశ్వదాభిరామ వినురవేమ*

నయ వినయులకి పరిస్థితి అర్థమైంది. వారు తండ్రితో, "అద్దంలో చిన్నదిగా కనబడే కొండ – అద్దానికి దగ్గర్లో లేకపోతేనే పెద్దదిగా అనిపిస్తుంది. కొండంత అవడానికి మేము ఇల్లు వదిలి వెళ్లిపోతాం. మరికొన్ని వేమన మంత్రాలు చెప్పు. జీవితాన్ని అర్థం చేసుకుందుకూ, కర్తవ్యాన్ని బోధించడానికీ పనికొస్తాయి" అన్నారు.

# ఉప్పు - కప్పురం



వాణిదాసు వాళ్లని ఆపలేదు, “కొండంత అవాలనికదా ఇల్లు వదిలిపెడుతున్నారు. చాలా సంతోషం. మీకు కొంత డబ్బిస్తాను. అవసరానికి వాడుకోండి. ఓ మంత్రాల సంచి ఇస్తాను. ఏదైనా విషయం అర్థం కానప్పుడు అందులోంచి ఓ చీటి తియ్యండి. చీటిలోని వేమన మంత్రం మీ సందేహాల్ని పటాపంచలు చేస్తుంది. ఒకోసారి కర్తవ్యం కూడా బోధిస్తుంది” అన్నాడు.

పిల్లలు సరేనన్నారు. తండ్రిలాగే పట్టువస్త్రాలు ధరించారు. సిగ ముడి వేసుకున్నారు. ఓ సంచిలో బట్టలు సద్దుకున్నారు. తండ్రి ఇచ్చిన డబ్బు, వేమన మంత్రాల సంచి తీసుకున్నారు. కాలినడకన బయల్దేరి ఆ రాత్రికి పొరుగూరు చేరుకున్నారు. సిద్ధపురం వాణిదాసు కొడుకులని తెలిసి గ్రామాధికారి వాళ్లని సగౌరవంగా తన ఇంటికి ఆహ్వానించాడు. తండ్రిని పోలిన వారి రూపురేఖలు, తేజస్సు, వేషం చూసి – వాళ్లు కూడా మహా పండితులనుకున్నాడు. మర్నాడు తన ఇంట పండితగోష్ఠి ఏర్పాటు చేసి గ్రామస్థుల్ని పిలిచాడు.

వచ్చినవారు ఒకరి తర్వాత ఒకరు పురాణ కథలపై సందేహాలు అడిగారు. నయ వినయులకి పురాణాలే సరిగ్గా తెలియవు. ఇక వాటిలో సందేహాలేం తీరుస్తారు? వాళ్ల బిక్కమొహాలు చూసి– పండితపుత్రులు పరమశుంఠలని ఎగతాళి చేసి వెళ్లిపోయారు వచ్చినవారు. “పోలికలుంటే చాలదు. మీ నాన్నంత వాళ్లయ్యేకనే దేశసంచారం చెయ్యండి” అని గ్రామాధికారి మందలించాడు. ఇలాగ అయిందేమని వాళ్లు మంత్రాల సంచిలోంచి చీటి తీస్తే అందులో ఇలా ఉంది.

***ఉప్పుకప్పురంబు నొక్క పోలిక నుండు***
***జూడ జూడ రుచుల జాడ వేరు***
***పురుషులందు బుణ్య పురుషులు వేరయా***
***విశ్వదాభిరామ వినురవేమ***

“నాన్న కర్పూరం. మనం ఉప్పు. చూపులకి ఆయనలా ఉంటే సరిపోదు. నోరు విప్పినప్పుడూ ఆయనకులా పండితులం అనిపించాలి. అందుకేంచెయ్యాలీ?” అని అన్నదమ్ములు ఇద్దరూ తీవ్రాలోచనలో పడ్డారు.

ముందు వాళ్లు తండ్రిలా సాహిత్యంలో పండితులు కావాలనుకున్నారు. కానీ అందుకు బోలెడు పుస్తకాలు చదవాలి. ఎన్నో విషయాలు గుర్తుపెట్టుకోవాలి. అది తమవల్ల కాదు. ఆలోచించగా వాళ్లకి సంగీతం సులభమనిపించింది. ఇద్దరూ ఊరి పొలిమేరలో ఎవరూ లేనిచోట ఓ చెట్టు కిందకి చేరారు – సంగీత సాధన కోసం.

# అడవి ప్రయాణం



ముందు నయుడు గొంతెత్తి 'చందమామ రావే జాబిల్లి రావే' అని తనకి తెలిసిన పాట అందుకున్నాడు. వెంటనే వినయుడు చెవులు మూసుకుని, "అబ్బా, నువ్వు పాడుతుంటే గాడిద ఓండ్రపెట్టినట్లుంది" అన్నాడు. నయుడికీ తన గొంతు అలాగే అనిపించి, "పోనీ నువ్వు పాడు" అన్నాడు. వినయుడి పాట కూడా అలాగే ఉంది.

"మన పాట మనకే నచ్చకపోతే ఇతరులనెలా మెప్పించగలం?" అని ఇద్దరూ కలవరపడ్డారు. అప్పుడు వారికి మంత్రాల సంచి గుర్తొచ్చింది. అందులోంచి తీసిన చీటిలో ఈ కింది పద్యముంది.

***ఊరిలోన బుట్టి యూరిలోన బెఱిగి***
***యూరిలోనె జ్ఞానవంతుడయ్యె***
***యూరు విడిచిపెట్టి యడవి జేరుట మేలు***
***విశ్వదాభిరామ వినుర వేమ***

"ఊరుకంటే అడవి మేలంటోంది వేమన మంత్రం. కానీ అడవిలో పులులు, సింహాలు, తోడేళ్లు ఉంటాయి. అవి మనని చీల్చి చెండాడి తినేస్తాయి. కాబట్టి మనం అడవికి వెళ్లొద్దు. ఐనా అడవి అంటే అడవే కాదు. నూతిలో కప్ప సామెత తెలుసుగా. ఎంత చదివినా ఉన్న ఊళ్లోనే ఉంటే బుద్ధి వికసించదు. తెలివి పెరగాలంటే తెలిసిన ప్రాంతాలు వదిలి కొత్త చోట్లలో మసలమని అర్థం. మనం మనకెవరూ తెలియని కొత్త చోటుకి వెడదాం" అన్నాడు నయుడు.

"కొత్త చోటుకి వెళ్లాలన్న నీ ఆలోచన సరైనదే. కానీ వేమన ఊరుకన్న అడవి మేలు – అన్నాడంటే ఊరికే అనుండడు. అడవి కూడా కొత్తచోటే కదా. మనం అడవికే వెళ్లి వేమన మంత్రాన్ని చెప్పింది చెప్పినట్లు పాటిద్దాం. ఐనా అడవిలో క్రూరమృగాలే కాదు. తపస్సు చేసుకునే మునులు కూడా ఉంటారు. వాళ్లని కలుసుకుని కాళ్ల మీద పడదాం. వాళ్లకి మహిమలుంటాయి. వాటితో వాళ్లు మనని ఏ కష్టమూ పడకుండా గొప్పవాళ్లని చేయొచ్చు. సాహసం చెయ్యడానికి భయపడితే కలకాలం సామాన్యులుగానే మిగిలిపోతాం. ఏమంటావ్?" అన్నాడు వినయుడు.

నయుడికి కూడా ఈ ఆలోచన నచ్చి సరేనన్నాడు. లేడికి లేచిందే పరుగన్నట్లు అన్నదమ్ము లిద్దరూ తక్షణమే లేచి ప్రయాణం కట్టారు. రెండు రాత్రులూ రెండు పగలూ ప్రయాణం చేసి ఓ అడవి ముందుకొచ్చారు. అది చీమలు దూరని చిట్టడవి. కాకులు దూరని కారడవి. నయ వినయులు అందులో అడుగెట్టారు. దారి పొడుగునా ముళ్లున్నా లెక్క చెయ్యక ముందుకి నడిచారు.

# సాధన

అలా నడిచి నడిచి కొంత దూరం వెళ్లాక నయ వినయులకి ఒక చెట్టు కింద కూర్చుని తపస్సు చేసుకుంటున్న ముని కనిపించాడు. వాళ్లు ఆయన కళ్లు తెరిచేదాకా ఓపికగా ఎదురు చూశారు. ముని కళ్లు తెరచి తమని చూడగానే ఇద్దరూ ఆయన పాదాల మీద పడిపోయారు. ఆయన వాళ్ల కథ విని వాళ్లకి సంగీతం నేర్పుతానన్నాడు.

"మేము గొంతెత్తి ఆలాపన చేస్తే గాడిదలు ఓండ్ర పెట్టినట్లుంటుది. మాకు మరేదైనా విద్య నేర్పండి" అన్నారు నయ వినయులు. ముని తల అడ్డంగా ఊపి వారిద్దరికీ చెరో ఉండా ఇచ్చాడు. "ఈ రోజుకివి చాలా చేదుగా ఉంటాయి. ఇవి రోజుకొకటి ఇస్తాను. కష్టమనిపించినా వెనుకాడకుండా భక్తితో భుజించండి. ఏ రోజు మీకివి తియ్యగా అనిపిస్తాయో ఆ రోజు నుంచి సంగీత సాధన మొదలెడితే మీరు తప్పక గొప్ప సంగీత విద్వాంసులౌతారు" అన్నాడు.

నయ వినయులా ఉండలు తిన్నారు. నోరంతా చేదుగా అయిపోయింది. వాటిని రోజూ తినడం తమవల్ల కాదనుకున్నారు. కర్తవ్యం తోచక మంత్రాల సంచిలో చేయిపెట్టి చీటి తీస్తే అందులో ఈ కింది పద్యం ఉంది.

*అనగననగ రాగమతిశయిల్లుచునుండు*
*తినగ తినగ వేము తీయనగును*
*సాధనమున పనులు సమకూరు ధరలోన*
*విశ్వదాభిరామ వినురవేమ*

తినగా తినగా వేపాకు కూడా తియ్యగా ఔతుందని తెలియగానే ధైర్యం కలిగి వాళ్లు ముని చెప్పినట్లే చేద్దామనుకున్నారు. నాలుగైదు రోజులు ఆ చేదు ఉండలు తినడానికి చాలా కష్టపడినా క్రమంగా వాళ్లా రుచికి అలవాటు పడ్డారు. నెల గడిచేసరికి వాళ్లకా ఉండలు తియ్యగా అనిపించాయి. ఆ విషయం మునికి చెప్పారు. ఆయన సంతోషించి వాళ్లకి సంగీతం నేర్పుతానన్నాడు. ముందుగా వాళ్లని కొన్నాళ్లపాటు తమకి తోచిన పాటలు గొంతెత్తి పాడుతూ సాధన చెయ్యమన్నాడు.

నయ వినయులు సాధన మొదలెట్టారు. ఆరంభంలో తమ గొంతులు గాడిద అరుపులా అనిపించినా జంకలేదు. వేమన మంత్రం గుర్తు చేసుకున్నారు. ఆ ఉండలు తియ్యగా ఐనట్లే తమ గొంతులూ శ్రావ్యం కాగలవనుకున్నారు. నెల గడిచేసరికి వాళ్ల గొంతులు శ్రావ్యమయ్యాయి. వాళ్లు బ్రహ్మానందపడి తమ గానాన్ని మునికి వినిపించారు.



# గురుభక్తి

ముని నయ వినయుల గొంతు విని శభాషన్నాడు. "మామూలుగా ఐతే సంగీతంలో పాండిత్యానికి కనీసం ఆరేళ్లు పడుతుంది. నా తపోశక్తివల్ల మీకు ఏడాది సరిపోతుంది. కానీ ఓ షరతు. అది వినేముందు మీరు నా కథ తెలుసుకోవాలి" అంటూ తన కథ చెప్పాడు.

మునికి ఆలుబిడ్డలున్నారు. అన్నదమ్ములున్నారు. తలిదండ్రులున్నారు. ముక్తి కోసం అందర్నీ వదిలి ఇక్కడికొచ్చి తపస్సు చేశాడు. ఎన్నో శక్తులు సంపాదించాడు. ఇప్పుడు తనవాళ్లని సంతోష పెట్టాలని ఆయన కోరిక. కానీ తనెక్కడున్నదీ వాళ్లకి తెలియడం ఇష్టంలేదు.

"చదువయ్యాక మీరు నా వాళ్లని కలుసుకోవాలి. మంచి మాటలతోనో, డబ్బిచ్చో వాళ్లకి సంతోషం కలిగించాలి. ఆ తర్వాతే మీరు మీ వాళ్లని కలుసుకోవాలి" అన్నాడు ముని.

నయ వినయులు ఆలోచనలో పడ్డారు. ముని బలగం పెద్దది. మాటలకి తృప్తి పడతారో లేదో తెలియదు. ఎంత డబ్బిస్తే సంతోషిస్తారో తెలియదు. తమ జీవితమంతా వాళ్ల పోషణకే సరిపోతుందేమో! ఏమీ తోచక మంత్రాల సంచిలోంచి చీటి తీస్తే అందులో ఈ పద్యం ఉంది.

**అన్ని దానములను అన్నదానమె గొప్ప**
**కన్నతల్లి కన్న ఘనత లేదు**
**యెన్న గురునకన్న ఎక్కువ లేదయా**
**విశ్వదాభిరామ వినురవేమ**

అన్నం ప్రాణం నిలబెడుతుంది. ప్రాణం నిలబడితేనే కద, మనిషి మిగతా దానాలు స్వీకరించగలడు. కాబట్టి అన్ని దానాల్లోకీ అన్నదానమే గొప్ప. మరి కన్నతల్లి ఉన్నన్నాళ్లూ తమకే లోటూ లేదు. ఆమె చనిపోగానే తండ్రి ఉన్నా ఇలా అడవుల పాలయ్యారు. కన్నతల్లి కంటే గొప్పవారు లేరన్న వేమన మాట అక్షరాలా నిజం. కాబట్టి గురువుకన్న ఎక్కువ లేదన్న వేమన మాట కూడా నిజమే ఔతుంది. అదే తాము పాటించాలనుకున్నారు వాళ్లు.

ముని వాళ్ల నిర్ణయానికి సంతోషించి వెంటనే మంత్రదండాన్ని గాలిలో ఊపాడు. వెంటనే ఆయన ముందు ఇద్దరు గంధర్వులు ప్రత్యక్షమయ్యారు. ముని వాళ్లకి నయ వినయుల్ని చూపించి, "ఏడాదిలో వీళ్లని సంగీత పండితుల్ని చెయ్యగల ప్రతిభ మీకే ఉంది. ఈ రోజే సంగీత శిక్షణ ప్రారంభించండి" అన్నాడు. నయ వినయులు గంధర్వుల శిక్షణలో సంగీత సాధన చేస్తూ మునిని తండ్రిలా ప్రేమించారు. యజమానిలా సేవించారు. దేవుడిలా పూజించారు.



# మాయ

ఏడాదిలో నయ వినయుల చదువు పూర్తయింది. సంగీత సాధనలో వారి శ్రద్ధకి ముచ్చటపడిన గంధర్వులు, "ఒకసారికి అగ్ని మిమ్మల్ని బాధించకుండా వరమిస్తున్నాం. ఇది మీకు భవిష్యత్తులో అక్కరకొస్తుంది" అని ముని వద్ద శలవు తీసుకుని మాయమయ్యారు.

ముని నయ వినయులతో, "ఇక సంగీతంలో మీకు మీరే సాటి. దేశసంచారం చేసి పాండిత్యం ప్రదర్శించండి. భోగభాగ్యాల్నీ, కీర్తిప్రతిష్ఠల్నీ పొందండి. నాకిచ్చిన మాట మర్చిపోకండి. మీకు నా దీవెనలు. వెళ్లిరండి" అన్నాడు. కానీ నయ వినయులు కదలలేదు. "మాకోసం మీరు ధారపోసిన తపోశక్తిని తిరిగి పొందేవరకూ ఇక్కడే ఉండి మిమ్మల్ని సేవించుకుంటాం" అన్నారు.

"మీకు విద్యాదానం చేసిన పుణ్యంవల్ల నా తపోశక్తి తగ్గలేదు. ఇక మీకు చింత వలదు. తక్షణం బయల్దేరి నా మాట పాటించి నాకు సంతృప్తి కలిగించండి" అన్నాడు ముని.

"మీ వాళ్లందర్నీ వెదికి పట్టుకుని సంతుష్టుల్ని చెయ్యడం మా విధి. కానీ సామాన్యులమైన మాకు అదంత సులభం కాదు. అందుకు మీరే తగిన ఉపాయం చెప్పాలి" అన్నారు వాళ్లు.

నిజానికి ముని ముక్తి కోసం అడవి కొచ్చాడు. కానీ తనవాళ్లపై మమకారం చావక ఆయనకు ముక్తి రావడంలేదు. నయ వినయులు తనవాళ్లకి సంతోషం కలిగించాలంటే తను వాళ్లకి మరిన్ని శక్తులివ్వాలి. శక్తులిచ్చేది తనవాళ్ల కోసం కాబట్టి ఆయన తపోశక్తి తగ్గిపోతుంది. మళ్లీ కొన్నేళ్లు తపస్సు చేస్తే తప్ప ఆ శక్తులు తిరిగి రావు. ముక్తి ఆలస్యమౌతుంది. ముని వాళ్లకిది చెప్పి, "నాకు సంతృప్తినిచ్చే మరే మంత్రమైనా ఉంటే త్వరగా ముక్తి పొందేవాణ్ణి" అని బాధపడ్డాడు. అప్పుడు వాళ్లకి మంత్రాల సంచి గుర్తుకొచ్చి అందులోంచి ఓ చీటి తీశారు. అందులో ఈ కింది పద్యముంది.

**ఆలు సుతులు మాయ అన్నదమ్ములు మాయ**
**తల్లి దండ్రి మాయ తాను మాయ**
**తెలియనీదు మాయ దీనిల్లుపాడాయ**
**విశ్వదాభిరామ వినురవేమ**

ఈ పద్యం వినగానే మునికి కనువిప్పయింది. "అరే! ఇన్నేళ్లు తపస్సు చేసి ఈ మాయని గుర్తించలేకపోయాను. ఇక నాకు ఆలు సుతులు, తల్లిదండ్రులు, బంధుమిత్రులు ఎవరిపైనా మమకారం లేదు. నా మనసంతా సంతృప్తితో నిండిపోయింది. మీరు వినిపించిన వేమన మంత్రం నాకు గురుదక్షిణే కాదు. మిమ్మల్నే నాకు గురువుల్ని చేసింది" అని వాళ్లని మెచ్చుకున్నాడాయన.



# సంపన్నుడు



నయ వినయులు ముని కాళ్లకి మొక్కి శలవు తీసుకున్నారు. ముని మాయలోంచి బయటపడినా – ఆయన వారసులకి తమ చేతనైన సాయం చెయ్యాలనుకున్నారు. ముని భార్యా బిడ్డలుండే శివపురం చేరుకుని ముని భార్య మౌనికని కలుసుకుని విషయం చెప్పారు.

మౌనిక పతివ్రత. భర్త ముక్తిని కోరి అడవికే వెడితే తనూ ఆయనతో బయల్దేరింది. కానీ ముని రావద్దన్నాడు. సంసారం చూసుకోమన్నాడు. ఆయన మాట శిలాశాసనంలా పాటించిందామె. ఆమె పెద్ద కొడుకు అధికుడిది ధాన్యం వ్యాపారం. మోసం చెయ్యడు. డబ్బుకి లోటులేదు కానీ అవసరం లేకపోయినా అప్పులు చేస్తాడు. ఎప్పుడూ దిగులుగా ఉంటాడు. తమ్ముడు విధేయుడికి అతడితో పడక విడిపోయి వేరే ఊరు వెళ్లి ఉంటున్నాడు. ఆ అన్నదమ్ములిద్దరూ సంతోషంగా కలిసుండాలని ఆమె కోరిక. అందుకేదైనా మంత్రం ఉపదేశిస్తే సంతోషిస్తానందామె.

అధికుడికి ఊరికల్లా సంపన్నుడు కావాలని కోరిక. అదేపనిగా అప్పులు చేసి ఆస్తి పెంచి అది సాధించాడు. ఊరికల్లా ఉన్నవాడని అతడెవర్ని ఎప్పుడు ఎంతడిగినా అప్పిస్తారు. తను కూడా పాతవి తీర్చి కొత్త అప్పులు చేస్తూంటాడు. కోరిక తీరినా ఎందుకో మనసుకి సంతోషంగా ఉండడంలేదని అతడు నయ వినయులకి చెప్పాడు. వాళ్లు మంత్రాల సంచిలో చెయ్యిపెట్టి వెలికి తీసిన చీటిలో ఈ కింది పద్యం ఉంది.

**ఉప్పులేని కూర యూనంబు రుచులకు**
**పప్పులేని తిండి ఫలము లేదు**
**అప్పులేనివాడె అధిక సంపన్నుండు**
**విశ్వదాభిరామ వినురవేమ**

అధికుడీ పద్యం విని, "నిజమే! ఉప్పులేని కూరకి రుచి తక్కువ. పప్పులేని తిండి బలమివ్వదు. అప్పున్న సంపదా అంతే అన్నమాట! ఒకర్నడగాల్సిన అవసరం లేని నేను అప్పు చెయ్యడం తెలివితక్కువ. ఈ రోజే నాకున్న అప్పులన్నీ మొత్తం తీర్చేస్తాను" అన్నాడు వాళ్లతో.

అప్పులన్నీ తీర్చేయడంతో అధికుడి సంపద బాగా తరిగిపోయింది. కానీ ఇప్పుడా ఊళ్లో అప్పు లేనివాడు అతడొక్కడే. దాంతో అందరికంటే తనే అధిక సంపన్నుడు అన్న భావం కలిగి మనసుకు చెప్పలేనంత సంతోషం కలిగింది. అతడి ఉత్సాహం చూసి తల్లి కూడా సంతోషించింది. నయ వినయులు అక్కణ్ణించి బయల్దేరి పొరుగూరు వెళ్లి విధేయుణ్ణి కలుసుకున్నారు.

# చెప్పుడు మాటలు



నయ వినయులు వెళ్లే సమయానికి విధేయుడు ఇంటిముందు బాట పక్కన ఉన్న ఓ చెట్టుకి ఊయల కడుతున్నాడు. తాడు లావుగా ఉండి ముడివేయడం కష్టంగా ఉంటే – సన్నని దారం ఉపయోగించాడు. అది పుటుక్కున తెగింది. అంతలో నయ వినయులు వచ్చారు. తమ గురించి చెప్పి విధేయుణ్ణి అన్నతో కలిసుండమని హితవు చెప్పారు.

విధేయుడు వాళ్లతో, "పెళ్లయ్యేదాకా నేను అన్న వ్యాపారంలో భాగస్వామిని. ఆయనేం చెబితే అది చేశానే తప్ప వ్యాపార రహస్యాలు తెలుసుకోలేదు. నా భార్య చపలకి నేనంటే బోలెడు ప్రేమ. అన్న నన్ను వ్యాపారంలో మోసం చేస్తున్నాడని తనే చెప్పింది. విడిపోదామనీ తనే చెప్పింది. నా మంచి కోరుతుందని అన్నీ తను చెప్పినట్లే చేస్తున్నాను. ఈ ఊరొచ్చాను. వ్యాపారంలో బాగా నష్టపోయాను. బ్రతుకుతెరువు కోసం నేను తోటమాలినయ్యాను. చపల వంటలక్కయింది. ఆదాయం చాలక అష్టకష్టాలు పడుతున్నాం. ఎప్పటికైనా మంచి రోజులొస్తాయంటుంది చపల. ఉన్నంతలో సరదాగా ఉండడానికి ఊయల కావాలంది. తనొచ్చేలోగా ఊయల కడదామని ఇంటికి కాస్త ముందొచ్చాను. ఈలోగా మీరొచ్చి నన్ను తిరిగి అన్న దగ్గిరకి వెళ్లమంటున్నారు. అలా చేస్తే నా భార్య బాధపడదా చెప్పండి?" అన్నాడు విధేయుడు వాళ్లతో.

అప్పుడు నయ వినయులు మంత్రాల సంచిలోంచి తీసిన చీటిలో ఈ క్రింది పద్యముంది.

***ఆలి మాటలు విని అన్నదమ్ముల రోసి***
***వేరు పడెడువాడు వెఱ్ఱివాడు***
***కుక్కతోక పట్టి గోదావరీదునా***
***విశ్వదాభిరామ వినురవేమ***

"అన్న చాటున సుఖంగా ఉన్నావు. ఆలి మాటలు విని వేరు పడ్డావు. చపల మాట విని బాగుపడ్డావా, లేదు. ఒకరు తోటపని, ఒకరు వంటపని చేస్తూ పేదరికంలో ఉన్నారు. కుక్కతోక పట్టి గోదావరీదితే కుక్కా, మనిషీ కూడా చస్తారు. ఊయలకి తాడు బదులు దారం కడితే పుటుక్కున తెగి కింద పడింది. చపల మాట వినడం – అలాగన్న మాట! నీ పేరే విధేయుడు. భార్యకి కాక అన్నకి విధేయుడైతేనే నీకు రాణింపు అంటోంది వేమన మంత్రం" అన్నారు నయ వినయులు.

విధేయుడిపై ఈ మాటలు మంత్రంలా పనిచేశాయి. కాసేపటికి అక్కడి కొచ్చిన చపలకీ ఆ మాటలు తలకెక్కాయి. ఆ దంపతులు నయ వినయులు చెప్పినట్లే చేశారు.

# పరమపదం



తన బిడ్డలిద్దరూ కలిసిపోయారని మౌనిక మురిసిపోయింది. అప్పుడు నయ వినయులు ముని తలిదండ్రులు, అన్నదమ్ముల గురించి అడిగారామెను. ఆమె వారితో, "నా బావగారు, మరిది, అత్తమామలు ఇక్కడికి దూరంగా బుద్ధపురంలో ఉన్నారు. ఇటీవలే నా అత్తమామలు కొడుకుల మీద అలిగారు. ఊరి చివర గుడిసె వేసుకుని అందులో ఉంటున్నారు. ఎంత బ్రతిమాలినా ఇంటికి రావడం లేదని మావాళ్లు నొచ్చుకుంటున్నారు" అని చెప్పింది. నయ వినయులామెను శలవడిగి బుద్ధపురం వెడుతూ దారిలో ఓ చెట్టు కింద విశ్రమించి సంగీత సాధన చేశారు.

మారువేషంలో గుఱ్ఱం మీద ఆ దారిన వెడుతున్న ఆ దేశపు రాజు ఆ పాట విని ఆగాడు. వాళ్లకి తానెవరో చెప్పి తన వద్దనున్న వెయ్యి వరహాల మూట కానుకగా ఇచ్చాడు. "కళాకారుల్ని ఘనంగా సన్మానించమని భీరపురం నగరపాలకుడు భీరుణ్ణి ఆదేశించాను. మీరక్కడికి వెళ్లండి" అని వెళ్లాడు. తర్వాత నయ వినయులు బుద్ధపురం చేరుకున్నారు. ముని తలిదండ్రుల్ని కలుసుకుని తమ గురించి చెప్పారు. వాళ్ల పేదరికానికి జాలిపడి తమ దగ్గిరున్న వెయ్యి వరహాల మూట ఇచ్చేశారు. వాళ్లు సంతోషించి, "మా కన్నబిడ్డలు అన్నమడిగితే గంజి పోశారు. పట్టుబట్టలడిగితే నూలుగుడ్డ ఇచ్చారు. పాన్పు కావాలంటే నులక మంచం వేశారు. మాకేమీకాని మీరు అడక్కుండానే ఇంత డబ్బిచ్చారు. మీరు మహానుభావులు. మాకు త్వరగా ముక్తి కలిగే మార్గం చెప్పండి" అన్నారు. అప్పుడు నయ వినయులు మంత్రాల సంచిలోంచి తీసిన చీటిలో ఈ కింది పద్యముంది.

*ఇసుక బొగ్గురాయి యినుమును స్వర్ణంబు*
*గసవు పోచవలెను గన్నవాడు*
*పరమపదము గాంచు బరిణామమందును*
*విశ్వదాభిరామ వినురవేమ*

"ముక్తి కలగాలంటే ఇసుక, బొగ్గు, ఇనుము, బంగారం – అన్నింటినీ గడ్డిపోచతో సమంగా చూడాలంటోంది వేమన మంత్రం. మీకేమో గంజి, నూలు, నులక మంచం తక్కువ. డబ్బే ఎక్కువ. ఇలా అనుకునే మీకు ముక్తి ఎలా వస్తుంది?" అన్నారు నయ వినయులు.

ముని తలిదండ్రులు సిగ్గుతో తలవంచుకుని, "మీరు చెప్పింది నిజం. మేము నిజంగా ముక్తినే కోరితే మా అబ్బాయిలా అడవులకే పోయి ఉండేవాళ్లం. మా బిడ్డల ప్రవర్తనవల్ల మాకు వాళ్లమీద మనసు విరిగిపోయింది. అందుకని ఇక్కడికొచ్చి ఈ గుడిసెలో ఉంటున్నాం. మీరిచ్చిన డబ్బుతో ఇకమీదట ఈ గుడిసెలోనే సుఖంగా రోజులు గడిపేస్తాం" అన్నారు.

# మంచి బిడ్డలు

నయ వినయులు వారితో, "మీరంతా కలిసుండాలని మునిగా మారిన మీ అబ్బాయి కోరిక. తనిప్పుడా బంధాలన్నీ తెంచేసుకున్నాడు. ఐనా ఆ కోరిక తీర్చడం మా బాధ్యత. మీరు మీ పిల్లలతో కలిసుండడానికి ఒప్పుకుంటే మేము మీకు ఇంకా ఇంకా డబ్బు తెచ్చిస్తాం" అన్నారు. ముని తలిదండ్రులు నవ్వి, "పరాయివాడివి. మేము కలిసుండాలని ఇంతలా పాకులాడుతున్నావు. వెయ్యి వరహాలిచ్చారు. ఇంకా మాకు డబ్బెందుకు? పిల్లలొచ్చి బ్రతిమాలితే చాలు" అన్నారు.

నయ వినయులు ముని అన్నదమ్ముల్ని కలుసుకుని విషయం చెప్పారు. వాళ్లు చిరాగ్గా, "అమ్మనీ నాన్ననీ మేము పొమ్మనలేదు. పోవాలనుకున్నారు. వెళ్లిపోయి మాకు చెడ్డ పేరు తెచ్చారు. మా తప్పేం లేదని ఊరందరికీ చెప్పి మళ్లీ మా ఇంటికొస్తే కాదనం. కానీ మేము వెళ్లి ఎందుకు బ్రతిమాలాలి?" అన్నారు. ఏమనాలో తెలియక నయ వినయులు మంత్రాల సంచిలోంచి ఓ చీటి తీశారు. అందులో ఈ క్రింది పద్యముంది.

*తల్లి దండ్రిమీద దయలేని పుత్రుండు*
*పుట్టనేమి వాడు గిట్టనేమి*
*పుట్టలోని జెదలు పుట్టవా గిట్టవా*
*విశ్వదాభిరామ వినురవేమ*

"మనకి జన్మనిచ్చి ఇంతవాళ్లని చేసిన తలిదండ్రులు దైవంతో సమానం. వృద్ధాప్యంలో వాళ్లని ఆదుకోవడం పుత్రుల కర్తవ్యం. అది పాటించకపోతే పుట్టలోని చెదల్లా– వాళ్లు పుట్టినా చచ్చినా ఒకటే అంటాడు వేమన. కాదంటే మీ ఇష్టం" అన్నారు నయ వినయులు.

ఆ పద్యం వాళ్ల మీద మంత్రంలా పని చేసింది. వాళ్లు వెంటనే, "చిన్నప్పుడు మాకు కోపమొస్తే బతిమాలో బామాలో దగ్గిరకి తీసుకునేవారు అమ్మా నాన్నా. పెద్దయ్యాక వాళ్లకి మామీద కోపమొస్తే మేమూ అలాగే చెయ్యాలి కదా! నువ్వు చెప్పేదాకా అది గ్రహించనందుకు సిగ్గు పడుతున్నాం" అన్నారు. అలా ఆ కుటుంబమంతా ఒక్కటైంది.

నయ వినయులు అక్కణ్ణించి బయల్దేరి భీరపురం పొలిమేరల్లో ఉన్న ఓ పెద్ద మఱ్ఱిచెట్టు కింద విశ్రమించారు. అలవాటు ప్రకారం సంగీత సాధన ప్రారంభించారో లేదో – ఆ చెట్టు మీంచి, "ఆహా! ఎంత మధుర గానం" అన్న మాట వినిపించింది. వాళ్లు తలెత్తి చూసేలోగా పైనుంచి ఓ పిశాచం కిందకి దూకింది. ఉలిక్కిపడ్డ నయ వినయులు పిశాచాన్ని చూసి తడబడ్డారు.



# మనిషి-దైవం



ఆ పిశాచం పేరు కంకాళుడు. దేవుడిలా పూజలందుకోవాలని వాడి కోరిక. అందుకని రోజూ కాసేపు భీరపురం నగరపాలకుడు భీరుణ్ణి పూనుతున్నాడు. ఆయనచేత మాయలు చేయిస్తాడు. జోస్యం చెప్పిస్తాడు. అన్నీ కంకాళుడి పేరుమీదే జరుగుతాయి. వాడికక్కడ ఎందరో భక్తులు. రోజూ భజనలు. వాడిమీద ఎన్నో పాటలు. కంకాళుడు నయ వినయులకి తన కథ చెప్పి, “మీరు చాలా బాగా పాడుతున్నారు. మీ నోట నన్ను పొగిడే పాట వినాలనుంది. మీరు భీరుణ్ణి కలిసి నన్ను కీర్తిస్తూ పాటలు పాడండి. ఆయన మీకు విలువైన కానుకలిస్తాడు” అన్నాడు.

ఒక పిశాచం నగరపాలకుణ్ణి ఆవహించడం, దేవుడిగా పూజలు అందుకోవడం ప్రజలకు క్షేమం కాదని నయ వినయులకి అనిపించింది. ఆ మాట పిశాచానికి చెప్పి లాభం లేదని మారు మాటాడకుండా అక్కణ్ణించి కదిలారు. నేరుగా భీరుడి దర్శనం చేసుకున్నారు. అప్పటికే కంకాళుడు భీరుణ్ణి ఆవహించాడు. ఆయన వాళ్లని చూస్తూనే, “ఈ నగరవాసులందరికీ ఇష్టదైవం కంకాళుడు. ఆయన్ని కీర్తిస్తూ పాటలు పాడండి. కానుకలిస్తాను” అన్నాడు.

తామింకా ఏమీ అనకుండానే ఆయనలాగనేసరికి ఏమనాలో నయ వినయులకి తోచలేదు. వాళ్లు మంత్రాల సంచిలోంచి చీటి తీసి అందులో పద్యం చదివారు.

***ఇంటిలోన జ్యోతి యెంతయు వెలుగగా***
***పొరుగువారి యగ్గి కరుగనేల***
***తాను దైవమాయె దైవము గొలుచురా***
***విశ్వదాభిరామ వినురవేమ***

“ఇంట్లో దీపం వెలుగుతుంటే – నిప్పుకని పొరుగింటికి పరుగెడతామా? ప్రతి మనిషిలోనూ దేవుడున్నాడు. ఆ దేవుడికి కొన్ని విధులున్నాయి. అవి మాని వేరే దేవుణ్ణి కొలవడం అవసరమా? ప్రతి మనిషీ నడిచే ఓ దేవుడంటుంది వేమన మంత్రం” అన్నారు నయ వినయులు.

భీరుడికి కోపం వచ్చింది, “నేను కంకాళుడి భక్తుణ్ణి. మీరు తనని కీర్తిస్తూ గానం చెయ్యాలని కంకాళుడి ఆన. పాటించకపోతే కఠిన శిక్ష తప్పదు” అన్నాడు వాళ్లతో.

నయ వినయులు భయపడలేదు, “నీవు గొప్ప కళాపోషకుడివని విన్నాం. మా గానంతో నిన్ను మెప్పించాలని వచ్చాం. నీవు నగరపాలకుడివి. మనుషులపట్ల అపచారం చేస్తే మమ్మల్ని శిక్షించొచ్చు. నువ్వు నమ్మిన దేవుణ్ణి మేము నమ్మకపోతే శిక్షించడం న్యాయం కాదు” అన్నారు.

# అల్పుడు

భీరుడు నవ్వి, "కంకాళుడి మాట మరిచిపొండి. నగరపాలకుడిగా నా ఆజ్ఞ పాటించండి. నేను చెప్పినట్లు కంకాళుడి భజన చెయ్యండి. ఆ పుణ్యఫలం మీకు శిక్ష తప్పిస్తుంది. విలువైన కానుకలిస్తుంది. లేదూ నగరపాలకుడి మాట కాదన్నందుకు శిక్ష తప్పదు" అన్నాడు.

"కంకాళుడు కానుక లిచ్చాడా? రోగాలు నయం చేశాడా? నీటి సదుపాయం కలిగించాడా? ప్రజలకేం మేలు చేశాడని వాడికి మేము భజన చెయ్యాలి?" అన్నారు నయ వినయులు.

భీరుడి కోపం కట్టలు తెంచుకుంది, "ఈ దేశపు రాజు నన్ను నగరపాలకుణ్ణి చేశాడు. కళాపోషణ చెయ్యమని ఆయనే నన్ను ఆదేశించాడు. అంత గొప్పవాణ్ణి నా మాట కాదంటారా? ఎంత పొగరు మీకు?" అంటూ వారిపై మండిపడ్డాడు. తమని కూడా ఈ దేశపు రాజే ఇక్కడికి వెళ్లమన్నాడని చెప్పాలని నయ వినయులకి నాలిక చివరిదాకా వచ్చింది. ఐనా నిర్ణయం తీసుకోక మంత్రాల సంచిలోంచి చీటి తీస్తే అందులో ఈ పద్యముంది.

***అల్పుడెపుడు పల్కు నాడంబరముగాను***
***సజ్జనుండు పల్కు జల్లగాను***
***కంచు మ్రోగుమట్లు కనకంబు మ్రోగునా***
***విశ్వదాభిరామ వినురవేమ***

భీరుడు నగరపాలకుడే కావచ్చు కానీ గొప్పలు చెప్పుకునే అల్పుడు. ఉత్తముడు గొప్పలకి దూరంగా ఉండాలి. కంచు మ్రోగినట్లు బంగారం మ్రోగదంటాడు వేమన. ఆ మాటే తమకి మంత్రమనుకుని, "మేము పాడింది విను. నచ్చితే కానుకలివ్వు. లేదా నీ ఇష్టం" అన్నారు వాళ్లు.

భీరుడు కోపంగా, "నగర పాలకుడినైన నేను, వేలాది నగర వాసులు కంకాళుడికి పూజలు చేస్తున్నాం. ఆ కంకాళుణ్ణి కీర్తించడానికి మీ అభ్యంతరం ఏమిటి?" అన్నాడు.

"కంకాళుడీ ఊరి చివర మఱ్ఱిచెట్టు మీద ఉండే పిశాచమని మాకు తెలుసు. తెలిసి తెలిసి ఓ పిశాచాన్ని కీర్తించలేం కదా!" అన్నారు నయ వినయులు.

"మీకు నమ్మకం లేకపోతేనేం. ఎందరో నమ్ముతున్నారు. కీర్తించకపోతే శిక్ష పడుతుందని నేను హెచ్చరించాను. ఐనా నా ఆజ్ఞ పాటించడం లేదంటే మీకు తల పొగరు ఎక్కువనుకోవాలి. దీనికి మీ సంజాయిషీ ఏమిటి?" అన్నాడు భీరుడు.

నయ వినయులు మారాలోచించలేదు. మంత్రాల సంచిలోంచి మరో చీటి తీశారు.



# చిత్తశుద్ధి

నయ వినయులు చీటిలో ఉన్న పద్యం ఇలా చదివారు.

**ఆత్మశుద్ధి లేని యాచార మదియేల**
**భాండశుద్ధి లేని పాకమేల**
**చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా**
**విశ్వదాభిరామ వినురవేమ**

"పాత్ర శుభ్రంగా లేకపోతే వంట పాడౌతుంది. అలాగే మనసులో నమ్మకం లేకపోతే ఆచారాలు, పూజలు వృథా! ఇది నాకే కాదు, మీ అందరికీ వర్తిస్తుంది" అన్నారు నయ వినయులు.

"మాకు చిత్తశుద్ధి లేదా? ఋజువు చెయ్యండి చూద్దాం" అన్నాడు భీరుడు సవాలుగా.

అప్పుడు నయ వినయులకి గంధర్వులిచ్చిన వరం గుర్తుకొచ్చింది. వెంటనే అక్కడ ఓ అగ్నిగుండం ఏర్పాటు చేయించి – భగభగ మండే ఆ మంటల్లోకి వెళ్లారు. జనం హాహాకారాలు చేశారు కానీ వాళ్లు మంటల్లోంచే, "దైవం మాలోనే ఉన్నాడని నమ్మాం. అగ్ని మమ్మల్ని బాధించలేదు. మా చిత్తశుద్ధి ఋజువైంది. కంకాళుడే దైవమని నిజంగా నమ్మినవాళ్లు ఇక్కడెవరైనా ఉంటే ఈ మంటల్లోకి వచ్చి మాతో కరచాలనం చేసి తమ చిత్తశుద్ధి ఋజువు చేసుకోవచ్చు" అన్నారు.

కొలువులో జనం నివ్వెరపోయారు. అప్రయత్నంగా వాళ్లకి చేతులు జోడించారు. కంకాళుడు కూడా వాళ్లు సామాన్యులు కారనీ, అక్కడ తన ఆటలు సాగవనీ తలచి భీరుణ్ణి విడిచి పారిపోయాడు. ఒక్కరూ తమవైపు రాకపోగా నయ వినయులు మంటల్లోంచి బయటకొచ్చి, "నీకు కంకాళుడేదో ఇస్తాడని ఆశ. ఏదో చేస్తాడని భయం. కానీ నిజంగా దేవుడన్న నమ్మకం లేదు. ఉంటే ధైర్యంగా మా దగ్గిర కొచ్చేవాడివి. నీకు చిత్తశుద్ధి లేదనడానికి ఇదే ఋజువు" అన్నారు భీరుడితో. కంకాళుడు వదిలినా అహం పోని భీరుడు, "మీకు నిప్పు నుండి తప్పించుకునే మాయ తెలుసు. అందుకే అడిగి మంటల్లోకి వెళ్లారు. మరి మీకిప్పుడు నూరు కొరడా దెబ్బల శిక్ష విధిస్తున్నాను. నిజంగా మీలో దైవముంటే మిమ్మల్ని మీరు కాపాడుకోండి" అని వికటంగా నవ్వాడు.

మరుక్షణం అక్కడికి చేతిలో కొరడాలతో ఇద్దరు భటులు వచ్చారు. సరిగ్గా అప్పుడే, "ఆగండి" అంటూ ఓ వ్యక్తి ముందుకొచ్చాడు. ఆయన తన మారువేషం తొలగించగానే ఆ దేశపు రాజని అందరికీ తెలిసిపోయింది. రాజు భీరుడితో, "ఈ దేశపు రాజుగా శాసిస్తున్నాను. నువ్వు వీళ్ల పాట విను. నచ్చితే కానుకలివ్వు. నచ్చలేదూ – ఏం చెయ్యాలో అప్పుడు చెబుతాను" అన్నాడు.



# చెప్పు-చెఱకు

భీరుడు గతుక్కుమన్నా వెంటనే తమాయించుకున్నాడు. "ప్రభూ! వీళ్లు నేరస్థులు. ఐనా మీ మాట నాకు శిలాశాసనం. సంగీతంలో వీళ్ల ప్రతిభ పరీక్షించడానికి భీరపురం ఆస్థాన సంగీత విద్వాంసుడు ఆక్రందుణ్ణి నియోగిస్తున్నాను" అన్నాడు. అప్పుడు నయ వినయులు గొంతెత్తి పాడితే రాజుతో సహా సభాసదులంతా పరవశించారు. కానీ ఆక్రందుడు వాళ్ల పాటకి శృతి లేదన్నాడు. సంగతులే తెలియవన్నాడు.

రాజు స్వయంగా సంగీత విద్వాంసుడు. నయ వినయుల గురించి ఆక్రందుడలా అనడం ఆశ్చర్యమనిపించింది. అప్పుడాయన సంగీత శాస్త్ర పరంగా కొన్ని ప్రశ్నలడిగితే – ఒక్కదానికీ ఆక్రందుడు బదులివ్వలేకపోయాడు. భీరుడు నవ్వి, "ప్రభూ! ఆక్రందుడు మహావిద్వాంసుడు. మొదటిసారిగా తమని చూసి భయపడుతున్నాడు" అన్నాడు.

"భీరుడు ఆక్రందుణ్ణి సమర్థిస్తున్నాడు. దీనికి మీరేమంటారు?" అన్నాడు రాజు నయ వినయుల్ని చూసి నవ్వుతూ. "మేము చెప్పేదేముంటుంది – వేమన మంత్రం తప్ప?" అంటూ వాళ్లు మంత్రాల సంచిలోని చీటి తీసి ఈ క్రింది పద్యం చదివారు.

అల్పబుద్ధి వాని కధికారమిచ్చిన<br>
దొడ్డవారినెల్ల దొలగగొట్టు<br>
చెప్పు దినెడు కుక్క చెఱకు తీపెఱుగునా<br>
విశ్వదాభిరామ వినురవేమ

రాజు అల్పుడైన భీరుడికి అధికారం ఇచ్చాడు. భీరుడు కొలువులో మంచివాళ్లని వదిలి అల్పులకే స్థానమిచ్చాడు. చెప్పు తినే కుక్కకి చెఱకు తీపి తెలియదంటాడు వేమన. ఈ వివరణ విని, "నగరపాలకుణ్ణి అల్పుడని చిన్నబుచ్చడం న్యాయం కాదు ప్రభూ!" అన్నాడు భీరుడు.

"నిన్ను నగరపాలకుణ్ణి చేసింది నేను. అది వీళ్లకి ఆడంబరంగా చెప్పి అల్పుడివయ్యావు. వీళ్లని నీ దగ్గిరకి పంపింది నేను. మాట వరసకి కూడా వీళ్లు నీకా విషయం చెప్పలేదు. చల్లగా నిండుకుండలా పలికిన వీళ్లు సజ్జనులు. కాదంటావా?" అన్నాడు రాజు.

సమయం వచ్చిందని నయ వినయులు రాజుకి కంకాళుడితో తమ అనుభవాన్ని చెప్పి, "ఆవహించడానికి పిశాచాలు అల్పులనే ఎన్నుకుంటాయని పెద్దలు చెబుతారు. అలా కూడా భీరుడు అల్పుడు. ఆయన అధికారంలో ఉండడం ప్రజలకు క్షేమం కాదు" అన్నారు.



# ఘనత

రాజు భీరుణ్ణి పదవి నుంచి తొలగించాడు. నయ వినయుల్ని భీరపురం పాలన బాధ్యత తీసుకోమన్నాడు. వాళ్లొప్పుకోలేదు. తాము సంగీత పండితులే కానీ పాలనలో శిక్షణ లేదన్నారు. అల్లుణ్ణి తొలగించిన స్థానంలో తిరిగి అల్లులనే నియమించరాదన్నారు. రాజు వాళ్లతో, "నగరానికి పిశాచం బాధ తప్పించారు. పదవీ వ్యామోహం లేదు. వేమన మంత్రాల్ని సమయానుకూలంగా ఉపయోగించగలరు. నగర పాలనకు ఇంతకంటే అర్హతలు అవసరం లేదు" అన్నాడు. వాళ్లు కాదనలేకపోయారు కానీ తాము నేర్చిన సంగీతవిద్య వృథా పోవడం ఇష్టం లేదు. అందుకని ఏడాదికి ఆరు నెలలు నయుడు నగరపాలకుడైతే ఆ సమయంలో వినయుడు సంగీత సాధన చేస్తానన్నాడు. అలాగే మరో ఆరు నెలలు వినయుడికి నగరపాలన, నయుడికి సంగీత సాధన.

రాజు వారి నిర్ణయాన్ని మెచ్చుకున్నాడు. వారికి అక్కడే ఘనసన్మానం తలపెట్టాడు. సిద్ధపురానికి రథం పంపి నయ వినయుల తలిదండ్రుల్ని వేడుక చూడ్డానికి రప్పించాడు. నయ వినయులు తండ్రితో, "నీవు ప్రసాదించిన వేమన మంత్రాలే మా ప్రగతికి సోపానాలయ్యాయి. ఈ ఘనత నీది" అన్నారు. తడబడే వాణితో, "అమ్మా! నీ కారణంగా ఇల్లు విడిచి ఇంత వారం అయ్యాం. ఈ ఘనత నీది" అన్నారు. వాళ్లు ఇద్దరి కాళ్లకీ మ్రొక్కితే వాణి నిజంగా ఘనత తమదే అనుకుంది. కానీ సన్మానంలో నయ వినయులనే తప్ప పెద్దలైన తమని పట్టించుకున్నవారే లేరు. ఆ మాట భర్తతో అంటే – ఆమెను సమాధానపర్చడానికి ఆయన ఈ వేమన మంత్రం చెప్పాడు.

*ఉన్న ఘనత బట్టి మన్నింతురే గాని*
*సిన్న పెద్దతనము లెన్నబోరు*
*వాసుదేవు విడిచి వసుదేవునెంతురా*
*విశ్వదాభిరామ వినురవేమ*

"నేను సిద్ధపురంలో పండితుణ్ణి. మనవాళ్లు దేశానికే గొప్ప సంగీత విద్వాంసులు. నాకు వేమన మంత్రాలు తెలుసు. మనవాళ్లు వాటితో ఎన్నో ఘనకార్యాలు చేశారు. కృష్ణుడికి తండ్రి కదా అని వసుదేవుణ్ణి దేవుడనరు కదా! మన సంగతీ అంతే" అన్నాడాయన.

నయ వినయుల కథ తెలిసి ఎక్కడెక్కడి పౌరులు, పాలకులు వేమన పద్యాల్ని మంత్రాలుగా పఠించి ప్రయోజనం పొందసాగారు. ఇక నయ వినయుల పాలన భీరపురాన్ని అగ్రస్థానానికి తీసుకెళ్లిందని వేరే చెప్పాలా? ఈ కథ కొన్ని పద్యాల్నే పరిచయం చేసింది. మరి వేమన పద్యాలు – వందలు, వేల సంఖ్యలో ఉన్నాయి. పఠించండి – ప్రయోజనం పొందండి!





# యోగి వేమన

*కామిగానివాఁడు కవిగాఁడు రవిగాఁడు*
*కామిగాక మోక్షకామిగాడు*
*కామియైనవాడు కవియగు రవియగు*
*విశ్వదాభిరామ వినురవేమ!*

ఈ పద్యంలో చెప్పినట్లుగానే వేమన తొలి నాళ్లలో కాముకుడై వదినగారి సూచనను పాటించిన మీదట అదెంత నికృష్టమో తెలుసుకొని యోగి అయినాడు.

ఇలాగే అనేకానేక పద్యాలలో చెప్పిన వివరాలను బట్టి వేమన రెడ్డి కులస్థుడనీ, జన్మస్థలం కొండవీడనీ, 1412లో నందన సంవత్సర కార్తీక పూర్ణిమనాడు జన్మించాడనీ నిర్ధారణ అయింది. కదిరి దగ్గర ఉన్న కటారు పల్లెలో శార్వరి నామ సంవత్సర చైత్ర శుద్ధ నవమినాడు సిద్ధి పొందినట్లు ఆ పల్లె వాసులు చెబుతారు. ఇప్పటికీ అక్కడ యోగి వేమన సమాధి వుంది.

వారింటిలో నగలు తయారుచేసే సువర్ణకారుడు అభిరామయ్యకు లభించాల్సిన యోగాన్ని కపటోపాయంతో తాను పొంది యోగిచేత నాలుక మీద బీజాక్షరాలు రాయించుకుని మంత్రోపదేశం పొందుతాడు వేమన. ఆ మీదట పశ్చాత్తాపతప్తుడై అభిరామయ్య కాళ్ల మీద పడి క్షమార్పణ కోరుతాడు. జరిగిందంతా విని అభిరామయ్య వేమనను క్షమించానన్నా తృప్తిపడని వేమన, "నువ్వు నా గురుదేవుడివి. నీ పేరు శాశ్వతంగా ఉండేలాగ, నీ పేరు జోడించి 'విశ్వదాభిరామ వినుర వేమ' అనే మకుటంతో ఏనాడూ ఎవరూ ఎక్కడా కనీ వినీ ఎరుగని సారస్వతం సృష్టిస్తాను" అని శపథం చేశాడు.

అలా యోగి వేమన తన జీవితానుభవాలను రంగరించి వేన వేల పద్యాలు రచించి అభిరామయ్యకూ, తద్వారా తనకూ అనంతానంత కీర్తిప్రతిష్టలు సముపార్జించుకున్నాడు. తెలుగు సాహితికి అనన్యసామాన్య సేవలందించిన శ్రీ సి.పి. బ్రౌన్ దొర వేమన పద్యములను సేకరించి, కొన్నింటిని ఏర్చికూర్చి ఆంగ్లభాష్యంతో అచ్చువేయించి వేమన ఘనతకు ప్రపంచవ్యాప్తి కలిగించాడు. అనాదృత వాఙ్మయారాధకులు శ్రీ నేదునూరి గంగాధరం సంకలన గ్రంథం ప్రకారం యోగి వేమన రాసిన పద్యాలు అయిదు వేలకు పైగానే ఉన్నట్లు తెలుస్తోంది.



**For eBOOK: kinige.com**

మంచి పుస్తకం, తార్నాక, సికింద్రాబాదు, ఫోన్: 9490746614.

email: info@manchipustakam.in

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, ఫోన్: 040-24744580

నవోదయ బుక్‌హౌస్, హైదరాబాదు, ఫోన్ : 040-24652387

మైత్రీ బుక్‌హౌస్, విజయవాడ, ఫోన్: 9848631604

కావ్య పబ్లిషింగ్ హౌస్

వేమన మంత్రాలు

₹ 50/-